రాముఁడు ఏకపత్నీవతుఁడై పదివేలేండ్లు రాజ్యము పాలించెను. చాలకాలమునకు అశ్వమేధముచేసి కౌశల్య కాలధర్మమొందెను. పిదప సుమిత్ర కైకలును కాలధర్మము పొందిరి.

పిదప యుధాజిత్తు పిలిపింప భరతుడు పుత్రులతో మేనమామ యింటికేగెను. అక్కడ గంధర్వులను జయించి మరల రామునిదగ్గరకు బ్రియాణమై వచ్చెను. పిదప లక్ష్మణకుమారులను అంగదునిని పశ్చిమదిశకు చంద్రకేతునిని ఉత్తరదిశకు రాజులుగా జేసెను. లక్ష్మణ కుమారులను ఆ దేశములందుంచి మరల రాముని వద్దకేగెను.

అనంతరము మునిరూపముతో యముడువచ్చి మనమిద్దరము మాట్లాడవలెను. అపుడు ఎవరును ఉండరాదు అని రామునితో బ్రహ్మ సందేశమును వినిపించి యింక వైకుంఠమునకు రమ్మనెను. అట్లు రాముఁడు యముడును సంభాషించు చుండ దుర్వాసుఁడువచ్చెను ఎవరిని లోపలకు పంపవలదు పంపినచో మరణదండనమే అని రాముడనెను కాని దుర్వాసుని వారించినచో వంశమంతయు నాశనము అగునని శపించును. లోనికి పంపినచో దనకుమాత్రమె మరణదండన మగును దీనివల్ల వంశరక్షణ జరుగునని లక్ష్మణుడుతలచి దుర్వాసుని లోనికి పంపెను. దుర్వాసుడు వచ్చి వెళ్ళిన పిదప రాముఁడు తన నియమములను తలచుకొని శోకముతో దీనుడై ఏమియు మాటాడలేకపోయెను.

అపుడు లక్ష్మణుఁడు రామునితో నిట్లనెను " నాకొరకు చింతింపకు. కాలగతియిట్టిదే, నన్ను వధించి ప్రతిజ్ఞను నెరవేర్చుము. ఇది యంతయు ఇట్టిదే. దైవసంకల్పమే లక్ష్మణుని వియోగము అని వసిష్ఠాదులనిరి. అపుడు రాముఁడు లక్ష్మణుతోననెను. సౌమిత్రీ! ఇదిధర్మముకాదు, నిన్ను విసర్జించు చున్నాను త్యాగమువధయు రెండు యొకటేఅనిం అపుడు రాముడు బాష్పములతో నిండి యింటఁ బ్రవేశింపకయే సరయూతీరమున వెడలి పోయెను. అతడు సర్వేంద్రియ శ్రోతస్సులను నిగ్రహించి నిశ్వాసముతీయక యుం

డెను. అపుడు తనపై దేవతలు పుష్పవర్షము కురిపించిరి. ఇంక ఇంద్రుడు లక్ష్మణుడును స్వర్గము చేరిరి.

లక్ష్మణుని విడచి రాముడపుడు శత్రుఘ్నపుత్రులకు కుశలవులకభిషేకము చేసి భరతాదులుకూడ రాఁగా సరయూనదికిఁ బోయెను. అపుడు హనుమద్విభీషణులు ఆచంద్రార్కముగనుండ దీవించికూడ బయలుదేఱు సుగ్రీవునాపి సరయూ నదిలో దిగి బ్రహ్మాదులు ప్రార్థింప వైష్ణవ తేజస్సును రాముడు ప్రవేశించెను.

ఇట్టిరామాయణము చదివినను వినినను వ్రాసినను సర్వ శ్రేయస్సులు కలుగును.

ఇది
వాల్మీకిచే రచింపబడి చర్ల గణపతిశాస్త్రిచే
సంగ్రహముగ అనువదింపబడిన
ఉత్తర రామాయణము
పరిపూర్ణము.

ఓం శాంతి శాంతి శాంతిః